ఆరూపముగ అనుభవించువాడు పరమాత్మయే. అందుచే, సమస్త యజ్ఞములకును తానే భోక్తనని నిర్ధారించి చెప్పినాడు పరమాత్మ. సర్వతపస్సులకును - సర్వోపాసనలకును - ఆయనయే భోక్త. ఎప్పుడు ఎక్కడ ఎవరు ఏ రూపనామములను అర్చించినను, ఉపాసించినను, ఆ అర్చనలు, ఉపాసనలు చెందునది ఆయనకే. ఎందుచేతఅనగా-సర్వలోకములకు, సర్వదేవతలకు ప్రభువు ఆ పరమాత్మయే. దయాసముద్రుడు కనుక సర్వులకు ఆయన సుహృత్తు - మిత్రుడు - మేలుచేయువాడు. పరమాత్మను గూర్చిన ఈ జ్ఞానము కలిగినవాడు శాంతిని - భగవదనుభవరూపముక్తిని - పొందుచున్నాడు.

ఇచ్చట 'మాం' 'నన్ను' అని చెప్పుటచే - సగుణోపాసన చేసినను, నిర్గుణోపాసన చేసినను, చివరకు పొందునది సగుణసాకారతత్త్వమగు తననే అని సిద్ధాంతీకరించుచు పరమాత్మ ఈ అధ్యాయమును ముగించుచున్నాడు.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే కర్మసన్న్యాస
యోగోనామ పంచమోఽధ్యాయః

ఇతి శ్రీ పరమహంస పరివ్రాజకాచార్యాణాం
శ్రీ యదుగిరి యతిరాజ సంపత్కుమార...ద్ర
శిష్యేన సీతారామయతినా విరచితే ...మృతవాహినీ
నామక గీతాభాష్యే కర్మసన్న్యాస...యోగోనామ
పంచమోఽధ్యా...